Registered No. HSE-49/2016






ఆంధ్రప్రదేశ్ రాజపత్రము

# THE ANDHRA PRADESH GAZETTE

## PUBLISHED BY AUTHORITY

**W.No.18** AMARAVATI, TUESDAY , MAY 8, 2018 **G.94**

**PART II - MISCELLANEOUS NOTIFICATIOSN OF INTEREST TO THE PUBLIC**

--x--

## NOTIFICATIONS BY HEADS OF DEPARTMENTS Etc.,

### REVENUE DEPARTMENT

**(Land Acquisition)**

Rc.No. C/280/2017 **ప్రకాశం జిల్లా భూసేకరణ ప్రకటన** Date : 21-10-2017

**ఫారం నెం. VI (ఎ)**

**(2013వ సంవత్సరం 30వ చట్టం వలన భూసేకరణ, పునరావాసం, పున:స్థాపనలలో న్యాయపరమైన నష్టపరిహారం పొందే హక్కు పారదర్శకత చట్టంలో సెక్షన్ 11(1) మరియు ఆంధ్రప్రదేశ్ నియమావళి 2014లో రూల్ 19, సబ్‌రూల్ (1) ననుసరించి)**

**ప్రాథమిక ప్రకటన**

ఈ దిగువనుదహరించిన షెడ్యూలు దాఖలా భూములను ప్రజా హిత ఉపయోగార్థం అనగా కందుల ఓబులరెడ్డి గుండ్లకమ్మ రిజర్వాయరు ప్రాజెక్టు నిర్మాణములోని మణికేశ్వరం గ్రామ ముంపు బాధితుల ఆర్ అండ్ ఆర్ కాలనీ నందు ఇంటి నివేశన స్థలములు మంజూరు చేయుట కొరకు భూమి కావలయునని శ్రీ స్పెషల్ కలెక్టరు (భూసేకరణ), పూలసుబ్బయ్య వెలిగొండ ప్రాజెక్టు, ఒంగోలువారు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము భావించినందున, 2013వ సంవత్సరం 30వ చట్టం వలన భూసేకరణ, పునరావాసం, పున:స్థాపనలో న్యాయపరమైన నష్టపరిహారం పొందే హక్కు పారదర్శకత చట్టంలో సెక్షన్ 11(1) న నిబంధనలననుసరించి ఇందుకు సంబంధించిన యావన్మందికి ఇందుమూలముగా నోటీసు జారీ చేయబడినది.

పైన పేర్కొనిన చట్టంలో సెక్షన్–12 క్రింద ఇవ్వబడిన అధికారములను వినియోగించి ప్రత్యేక ఉప కలెక్టరు (భూసేకరణ), కందుల ఓబులరెడ్డి గుండ్లకమ్మ రిజర్వాయరు ప్రాజెక్టు వారికి, వారి సిబ్బందికి మరియు పనివారలకు ఆ భూముల భూసేకరణకై సెక్షన్ క్రింద ఇవ్వబడిన అధికారములను వినియోగించుటకు అధికారము ఇవ్వబడినది.

పై చట్టములోని సెక్షన్ 11(4) ననుసరించి, ఈ ప్రాథమిక ప్రకటన వెలువడిన తేది నుండి శ్రీ ప్రత్యేక కలెక్టరు /భూసేకరణ అధికారి వారి ముందస్తు అనుమతిలేనిదే, ఏ వ్యక్తి ప్రకటనలో తెలిపిన భూమిని ఏవిధమైన అమ్మకం / కొనుగోలు (క్రయ విక్రయములు) లేదా ఏవిధమైన లావాదేవీలు జరుపరాదని తెలియజేయడమైనది.

పై చట్టంలోని సెక్షన్ 15 ననుసరించి భూసేకరణపై ఏమైనా అభ్యంతరములు / ఆక్షేపణలు ఉన్న యెడల సంబంధించిన వ్యక్తి / వ్యక్తులు ఈ ప్రకటనలు ప్రచురించిన తేది నుండి 60 (అరువది) దినములలోగా శ్రీ స్పెషల్ కలెక్టరు (భూసేకరణ) అధికారి వారి ఎదుట అభ్యంతరములు దాఖలు చేసుకొనవచ్చును.

## షెడ్యూలు

జిల్లా : ప్రకాశం మండలము : అద్దంకి గ్రామము : మణికేశ్వరం

| క్రమ సంఖ్య | సర్వేనెం./ స.డి.నెం. | మొత్తం విస్తీర్ణం ఎ.సెం. | ముంపు క్రింద తీసుకొను విస్తీర్ణం ఎ.సెం. | భూస్థితి | సంబంధిత ఆసామీ పేరు మరియు చిరునామా | సరిహద్దులు | | | | చెట్లు మరియు కట్టడముల వివరాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | ఉత్తరం సర్వేనెం. స.డి.నెం. | దక్షిణం సర్వేనెం. స.డి.నెం. | తూర్పు సర్వేనెం. స.డి.నెం. | పడమర సర్వేనెం. స.డి.నెం. | |
| 1. | 210 /1బి | 7.67 | 7.67 | పుంజ | అయినంపూడి అచ్చయ్య<br>తండ్రి గోవిందయ్య<br>అయినంపూడి ఆంజనేయులు<br>తండ్రి బ్రహ్మయ్య<br>సోమ వెంకటేశ్వరరెడ్డి<br>తండ్రి వీరారెడ్డి<br>యిదా శింగారెడ్డి<br>తండ్రి రాఘవరెడ్డి<br>అద్దంకి సుబ్బారావు<br>తండ్రి సుబ్రహమణ్యం | 209 | 213<br>212 | 211 | 195<br>197<br>188 | |
| 2. | 195 | 5.93 | 5.93 | పుంజ | సన్నపురెడ్డి వెంకట సుబ్బమ్మ<br>భర్త రాఘవరెడ్డి | 196<br>197 | 188/<br>1B2 | 210 | 194 | |
| | | | | | మేకల సంజీవరెడ్డి<br>తండ్రి రంగారెడ్డి | | | | | |
| 3. | 213/ 1ఎ | 1.03 | 1.03 | పుంజ | మేకల సుబ్బారెడ్డి<br>తండ్రి రంగారెడ్డి | 210 | 213/<br>1C | 212 | 188/<br>1B2 | |
| 4. | 188/ 1బి2 | 13.72 | 13.72 | పుంజ | సన్నపెరెడ్డి సుధాకరరెడ్డి<br>సన్నపురెడ్డి పిచ్చిరెడ్డి<br>పాకనాటి అంజమ్మ<br>సన్నపురెడ్డి అంజమ్మ<br>రామాల మల్లారెడ్డి | 195 | NSP Canal | 213 | 188/<br>1A | |
| | **మొత్తం** | **28.35** | **28.35** | | | | | | | |

**డి. సుదర్శనం,** ఎమ్.ఏ.,
స్పెషల్ కలెక్టరు (భూసేకరణ),
పి.యస్. వెలిగొండ ప్రాజెక్టు, ఒంగోలు.

---x---

Published and Uploaded by the Commissioner of Printing, Government of Andhra Pradesh at Government Regional Press, Vijayawada, www.apegazette.cgg.gov.in